# మనోధర్మ సంగీతం



గ్రంథకర్త :

డా॥ శ్రీపాద పినాకపాణి




ప్రచురణ :

తెలుగు విశ్వవిద్యాలయం

లలితకళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్,

నాంపల్లి, హైదరాబాదు - 4.

"MANODHARMA SANGEETHAM" –

తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ : 123

ప్రథమ ముద్రణ : 1992

ద్వితీయ ముద్రణ : 1994

ప్రతులు : 2000

వెల రూ. 30/–



ప్రతులకు :
రిజిస్ట్రార్
తెలుగు విశ్వవిద్యాలయం,
లలితకళాక్షేత్రం,
పబ్లిక్‌గార్డెన్స్, నాంపల్లి,
హైదరాబాదు - 500 004.

ముద్రణ :
శివాజీ ప్రెస్,
4-4-53, గంజ్‌బజార్,
సికింద్రాబాద్-500 003.

# భూమిక

ఆచార్య పేర్వారం జగన్నాథం
ఉపాధ్యక్షులు

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు

తెలుగు భాషా సాహిత్యాలు, చరిత్ర, సంస్కృతి లలితకళలు జానపద గిరిజన విజ్ఞానం— ఇత్యాది రంగాలలో తెలుగువారి కృషిని ప్రోత్సహించడానికి, ప్రాచుర్యం కలిగించడానికి 1985లో తెలుగు విశ్వవిద్యాలయం అవతరించింది. అప్పటినుండి విశ్వవిద్యాలయం ఆ మార్గంలో విశేషమైన కృషి సాగిస్తున్నది. బోధన పరిశోధన కార్యక్రమాలను చేపట్టి అవిరళమైన కృషి చేస్తున్నది. గ్రంథ ప్రచురణ కార్యక్రమాలద్వారా అలభ్య అముద్రిత గ్రంథాలను తెలుగు పాఠకులకందిస్తున్నది. ప్రాచీన ప్రబంధాలనూ ఆధునిక సాహిత్య ప్రక్రియలకు సంబంధించిన సుప్రసిద్ధ గ్రంధాలనూ ప్రచురిస్తున్నది. కొన్ని ప్రత్యేకాంశాలపై ఆయా రంగాల్లో నిపుణులైన విద్వాంసులతో గ్రంధాలు రచింపచేసి ముద్రిస్తున్నది. లలితకళలకు సంబంధించిన పాఠ్య గ్రంథాలను కూడా ప్రచురించి విద్యార్థులకు అందిస్తున్నది. ఇటీవల ఆంగ్లంలోగల అంబేద్కర్ రచనల సంపుటాలను తెలుగులోనికి అనువదింపజేసింది. ఇట్లా పలుకార్యక్రమాలతో తెలుగువారి అభిరుచులకు అనుగుణంగా వారి అవసరాలను తీరుస్తూ విజ్ఞానపథంలో ప్రగతిని సాధిస్తున్నది.

ఇప్పుడు సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు-పద్మభూషణ్ డా॥ శ్రీపాద పినాకపాణి గారు రచించిన ''మనోధర్మ సంగీతం'' అనే గ్రంధాన్ని ప్రచురించి సంగీత ప్రియులకు అందిస్తున్నాము. డా॥ శ్రీపాద పినాకపాణి వైద్యరంగంలోనూ సంగీతశాస్త్రంలోనూ సమున్నత శిఖరాలు అందుకున్న ప్రతిభామూర్తి. డా॥ పినాకపాణి అగ్రశ్రేణి గాయకులెందరికో గురుస్థానంలో వున్న గొప్ప విద్వాంసుడు ఆయన. అభ్యాస సంగీతానికి అనుపూరకంగావుండే మనోధర్మ సంగీతంపై ఈ ప్రామాణిక గ్రంథాన్ని రూపొందించి సంగీత ప్రపంచానికి డా॥ శ్రీపాద నిరుపమాన సేవచేశారు. సంగీత లిపి, స్వరకల్పన, నెరవు, రాగాలాపనలను గురించి సాధికారికంగా వివరించిన ఈ గ్రంథం విద్యార్థులకేకాక అధ్యాపకులకూ, సంగీతాభిమానులకు కూడా ఎంతో ప్రయోజనకరంగా వుంటుందని విశ్వసిస్తున్నాము. తెలుగు విశ్వవిద్యాలయం దీన్ని ముద్రించడానికి అనుమతించిన శ్రీ పినాకపాణిగారికి నా ధన్యవాదాలు.

హైదరాబాదు,
తేది : 5-8-1994

[పేర్వారం జగన్నాథం]

# పీ ఠి క

శాస్త్రీయ సంగీతం అభ్యాస సంగీతమనీ, మనోధర్మ సంగీతమనీ, రెండు విధాలు : సరళీవరుసలూ, జంట వరుసలూ, అలంకారములూ, గీతములూ, స్వరజాతులూ, స్వర పల్లవులూ, వర్ణములూ, కృతులు, జావళీలూ, పదములూ అభ్యాస సంగీతానికి చెందుతాయి; స్వరకల్పన, రాగము, నెరవు, పల్లవీ మనోధర్మ సంగీతానికి ఉదాహరణలు.

గౌరవప్రదమైన సంగీతజ్ఞానము కలిగిన గురువుల వద్ద అభ్యాససంగీతం నేర్చుకొని దీక్షతో శ్రద్ధగా తగినంతకాలం సాధకం చెయ్యడమే కాకుండా, ప్రసిద్ధ గాయకుల సంగీతం విశేషంగా వినిన శిష్యులకు లయజ్ఞానము, స్వరజ్ఞానము, రాగజ్ఞానము అలవడతాయి. ఆ విధమైన కృషి చేయలేని, చేసినా మనోధర్మ సంగీతం అలవడని, విద్యార్థులు చాలామంది ఉంటారు. వీరికే శ్రద్ధ, పట్టుదల, తాపత్రయము ఎక్కువగా ఉంటాయికూడాను. సాధారణంగా ఈ రెండవ తెగకు చెందిన విద్యార్థులను "మనోధర్మ సంగీతం చెప్పేదేమిటి ?" అని తోసి వేయడమేనా, వారిచేతకూడా రాగం, స్వరకల్పనా, నెరవూ పాడించడానికి వీలుందా ? "వీలున్నది" అని చెప్పే జవాబే ఈ పుస్తక రూపంగా మనవి చేస్తున్నాను.

ఈ పుస్తకంలో సంగీతలిపి (నొటేషను), స్వరకల్పన, నెరవు, రాగము అనే నాలుగు ప్రకరణాలున్నాయి.

క్రిందటి దశాబ్దాలలో కంటే ప్రస్తుతకాలంలో సంగీతం నొటేషనులో వ్రాయగలిగిన సంగీతజ్ఞులు చాలామంది ఉన్నారు.

సంగీతం స్వరపరచి వ్రాయడానికి స్వరజ్ఞానము, అనుస్వరజ్ఞానము, లయజ్ఞానము, అవసరం. ఈ మూడు జ్ఞానాలు ఉన్నవారికే నొటేషను వ్రాసే, చదివే, జ్ఞానం కలుగుతుంది. అభ్యాస సంగీతం క్షుణ్ణంగా నేర్చి సాధకం చేసిన విద్యార్థులకే జ్ఞానం కలుగుతుంది సాధారణంగా కొద్దో గొప్పో నొటేషను వ్రాయనేర్చినవారికి పాడినపాట పాడినట్లే అనుస్వర సహితంగా, లయబద్ధంగా వ్రాయడానికి పుస్తకం సహకరిస్తుంది. అచ్చంగా పాట పాడినట్లే వ్రాసిన నొటేషను కాకపోతే అది ఎందుకూ పనికిరాదు.

సుమారు 50, 60 కృతులు పాఠంచేసిన పిమ్మట సంగీత విద్యార్థికి కొద్దిగా స్వరకల్పన చేసే శక్తి వస్తుంది. అల్లా రానివాళ్లూ చాలామంది ఉంటారు. వారికీ వీరికీ కూడా గురువే స్వరకల్పన నేర్పాలి. ఒరవడి పెట్టి కాపీలు రాయిస్తే చేతివ్రాత (handwriting)

సొంపుగా వచ్చిన విధంగానే స్వరకల్పన కూడా విద్యార్థికి అబ్బుతుంది. విద్యార్థి చురుకుదనాన్ని బట్టి ఒకటి, రెండు, మూడు సంవత్సరాలు కష్టపడి నేర్చాలి, అంతే.

నెరవు పాడడానికి రాగజ్ఞానమూ లయజ్ఞానము అవసరం. నెరవు ఏ విధంగా నడపాలో వినికిడి జ్ఞానంతో గ్రహించాలి చాలా మట్టుకు. అల్లా గ్రహించలేని విద్యార్థులకు గురువు పాఠాలు వ్రాసినట్లే నెరవుకూడా వ్రాసి, అభ్యాస సంగీతం మోస్తరుగా నేర్చాలి. సరియైన మార్గంలో చెయ్యి పట్టుకుని నడిపించిన పిమ్మట విద్యార్థికి తనంతట తానే పాడగలిగిన జ్ఞానం కలుగుతుంది.

తమిళనాడులో, సంగీతం గురువువద్ద అభ్యసించకపోయినా, సంవత్సరాలపాటు రాగాలాపన విని, విని, వినికిడి అనుభవంతోనే రాగాలు పాడగలిగిన వ్యక్తులు చాలామంది ఉన్నారు. ఆంధ్రదేశంలో శాస్త్రీయ సంగీతం అంత ధారాళంగా వినబడడానికి మనం నోచుకోలేదు. అందుచేతనే సంగీతం యధావిధిగా నేర్చిన విద్యార్థులకు కూడా రాగం పాడే శక్తి రావడంలేదు. గురువే రాగం పాడుతూ విద్యార్థిచేత పాడిస్తూ నేర్చాలి. చెప్పగా, చెప్పగా, అభ్యాస సంగీతం నేర్చినవిధంగానే రాగంకూడా వచ్చేస్తుంది విద్యార్థికి. నొటేషను వ్రాసి, చదువనేర్చిన విద్యార్థికి ప్రసిద్ధరాగములలో తరుచూ వినబడే సంగతులను స్వరపరచి వ్రాసిచ్చి, వాటిని కంఠోపాఠంగా వచ్చేవరకూ చెప్పి, పాడించాలి. విద్వాంసులు పాడే రాగాలాపనలను నిరంతరం వింటూ ఉండడం అన్నిటికంటే ఎక్కువగా అవసరం. స్వరకల్పన పాడుతూ పాడించినట్లే రాగంకూడా గురువు నేర్చాలి.

కల్పనా సంగీతం అభ్యాస సంగీతం వలెనే పాఠం చెప్పి నేర్పించాలి ప్రతీ విద్యార్థికీను. అలా చెప్పగా విద్యార్థులకు మనోధర్మ సంగీతజ్ఞానం తప్పక లభిస్తుంది. ఇది వట్టి మాట కాదు అనుభవంతో చెప్పిన సలహా.

—పినాకపాణి

# విషయ సూచిక

# పీ ఠి క

## స్వరకల్పన

అభ్యాస సంగీతం సుమారు 25వర్ణాలు, 50 కృతులువరకు నేర్చి క్షుణ్ణంగా సాధకం చేసిన విద్యార్థులకు స్వరకల్పన చేసే జ్ఞానం వస్తుంది. అలాగ రాని విద్యార్థులకు కూడా స్వరకల్పన చేయగల శక్తి రావడానికి మార్గం ఉంది.

స్వరకల్పన చేయడానికి అనువైన చిన్న తాళాలలో అంటే రూపకం, మిశ్రచాపు, ఖండచాపు తాళాలలో (మేళకర్త రాగాలలో) కృతులు నేర్పాలి. ఈ తాళము లలో స్వరకల్పన చేయడం సులభం. ఖండచాపు, రూపకము, మిశ్రచాపు. ఆది తాళములకు 1 ఆవర్తములో 10, 12, 14, 16 అక్షరాలు ఉంటాయి. ఆవర్తములో వచ్చే స్వరాలు 2, 3, 4, 5, 6, 7, 8–ఖండాలుగా ఏర్పడి ఉంటాయి: ఉదాహరణకి – చతురశ్రజాతి రూపకతాళంలో హరి కాంభోజిరాగం అనుకోండి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| నీ, దా, పా, దపమ — — | 3 | 3 | 3 | 3 | |
| పదా మపా గమా దపమ — — | 3 | 3 | 3 | 3 | |
| పదప మగమ పా, దపమ — — | 3 | 3 | 3 | 3 | |
| నిస దని పద మపా మగమ — — | 2 | 2 | 2 | 3 | 3 |
| మగమప పమపద నిదపమ — — | 4 | 4 | 4 | | |
| రిసానిదప సనీదపమ — — | 6 | 6 | | | |
| పా; , సా నీ ద ప మ — — | 5 | 7 | | | |
| ద ప ద ని సా, స ని ద ప మ — — | 4 | 3 | 5 | | |

ఈ విధంగా ఆవర్తంలోని 12 అక్షరాలూ 2, 3, 4, 5, 6, 7 అక్షరాల ఖండాలుగా ఏర్పడి ఉన్నాయి కదా!

అందుచేత ఈ ఖండాలుగా ఏర్పడి ఉన్న 2, 3, 4, 5, 6, 7 అక్షరాలను ఒక్కటొకటిగా వ్రాసి విద్యార్థికి పాఠం చెప్పి బాగా సాధన చేయించాలి. ఇదే మొదటి పాఠం, స్వరకల్పనకు మూలాధారం.

ఈ 3, 4, 5, 6, 7, 8, 9, 10 స్వర ఖండాలను, కేవలం పొడి స్వరా

లతోగాని, పొడిస్వరాల విరామముల కూర్పుతోగాని ఏర్పరచుకోవచ్చు.
ఉదాహరణకి—

సరిస నిసని దనిద సనిద—సా, నీ, దా, సనిద
సరీ నిసా దనీ సనిద
సాని నీద దాప సనిద

ఈ విధంగా 3 3 3 3 ఖండాల (groups) ను పొడి స్వరాలతోనూ దీర్ఘస్వరాలతోను ఏర్పరచుకోవచ్చును. వేరే వేరే ఖండాలను రకరకాల ఆవుల (gaps) తో జతచేసి, వ్రాసి విద్యార్థిచేత సాధన చేయించడమే రెండవపాఠం :
ఉదా :

| | | |
|---|---|---|
| రి స ని సా | 3.2 | 3 అక్షరాల ఖండము, 2 అక్షరాల విరామము. |
| ప ద ప – మా, | 3.3 | |
| రి స ని – సా; | 3.4 | |
| గ రి స ని – సా | 4.2 | |
| గ రి స ని ద – నీ, | 5.3 | |
| స రీ స ని ద – నీ; | 6.4 | |
| గా రీ స ని ద – నీ | 7.2 | |

ఈ రెండు పాఠాలు స్వరకల్పనా జ్ఞానం కలిగేటందుకు పునాది వంటివి. ఇవి క్షుణ్ణంగా నాలుగు తాళాలలోనూ క్రమంగా సాధకం చేసిన విద్యార్థికి స్వర కల్పన కొద్దికాలములోనే అలవడుతుంది.

అటుపైని ఒక్కొక్క తాళము తీసుకుని, మొదటి కాలంలో 1,2 ఆవర్తాల స్వరములు, ద్వైకాలములో 1,2 ఆవర్తముల స్వరాలు సులభశైలిలో వ్రాసి, పాఠం చెప్పి, విద్యార్థిచేత పాడించాలి. ఇదే పాఠం మరొక విధంగా పరిశీలిస్తే – 10, 12, 14, 16 అక్షరాల కూర్పులు విన్యాసాలతో పాడడం విద్యార్థికి అలవాటవుతుంది, అన్నమాట.

ఈ నాలుగు తాళాలలోనూ చిన్న కృతులు పాఠం చేసిన విద్యార్థికి సమ జాగాకే కాకుండా 1, 2 అక్షరాల జాగాలకు కూడా 1, 2 ఆవర్తాల స్వరాలు కల్పన చేసి, చేయించాలి. ఈ పాఠాలు వల్లించిన విద్యార్థికి ఖండచాపు, రూపకం, మిశ్రచాపు, ఆది తాళాలలో ఒకటి, రెండు ఆవర్తాల వరకు మొదటి, రెండవ కాలములలో సమజాగాకి, ఒకటి రెండు అక్షరాల జాగాలను స్వరకల్పన విన్యాసముతో చేయడం వస్తుంది.

కాని, ఈ స్థితిలో విద్యార్థిపాడే స్వరాలు చిలకపలుకులలాగ చెప్పి పాడించిన స్వరాలలాగుంటాయి. వీరికిప్పుడు రెండు స్థాయిలలో - అనగా, మందర పంచమం మొదలు తారస్థాయి పంచమం వరకూ విచ్చలవిడిగా దాటు స్వరాలతోనూ, జంట స్వరాలతోనూ 2 ఆవర్తముల వరకూ కల్పిత స్వరములు వ్రాసిచ్చి ప్రతీదినమూ వాటిని శిష్యులచేత పాడించాలి. ఈ స్వరకల్పన కంఠోపాఠము చేసినా మంచిదే, కాని కంఠతః రావాలని వర్ణించనక్కరలేదు. రోజూ పాడుతూ ఉంటే, స్వరకల్పన ఏ యే దారులలో నడుస్తూ ఉంటుందో విద్యార్థికి బోధపడుతుంది. ఆ—జ్ఞానం చాలు, పురోగతికి.

అదేవిధంగా చిన్న పరిధిలో అనగా 4, 5 స్వరాల పరిమితిలో కూడా విన్యాసంతో కల్పిత స్వరాలు వ్రాసిచ్చి వాటినికూడా పాఠంచెప్పి సాధకం చేయించాలి, అది తరువాతి పాఠం.

ఈ పైన చెప్పిన పాఠాలన్నీ కంఠోపాఠం వచ్చే పర్యంతం నాలుగు తాళాలలోనూ సాధకంచేసిన విద్యార్థులకు స్వరకల్పనా జ్ఞానం రూఢిగా అలవడుతుంది. వట్టిమాటకాదు. నాకు అనుభవవేద్యం.

ఈ స్థాయివరకూ వచ్చిన 'విద్యార్థి'ని గురువు ఎదురుగా పాడుతూ పాడిస్తూ స్వరకల్పన కట్లు లేకుండా ధారాళంగాచేస్తూ అలవాటు చెయ్యాలి. అటుపైన వర్ణములలోని స్వరకల్పనా పద్ధతిని ప్రసిద్ధ కీర్తనలలోని చిట్టస్వరాలనూ, రీతులనూ విచక్షణాదృష్టితో పరిశీలన చేస్తూ ఆ కల్పనారీతులను విద్యార్థి మనసుకు నాటేలాగ బోధించాలి. ఇంతటితో శిక్షణ ముగుస్తుంది. అటుపైన మంచి వినికిడి, నిరంతర కృషి చేస్తూ విద్యార్థి స్వరకల్పనా జ్ఞానం అభివృద్ధి చేసుకోవాలి. వెనుకటి పాఠం క్షుణ్ణంగా వస్తేనే ముందుపాఠానికి వెళ్లాలి. తీవ్రమైన శ్రద్ధ కలిగి శక్తివంచన లేకుండా కృషి చేసిన విద్యార్థి స్వరకల్పన రక్తిగా చేయగలదు/డు.

స్వరకల్పన చేసేటప్పుడు స్వరాలు చిన్న చిన్న ఖండములుగాను, విరామములుగానూ ఏర్పడి ఉంటాయి. ఉదాహరణకి : ఆదితాళ ఆవర్తములో ఏ 32 అక్షరాల ఏర్పాటైనా గమనిస్తే 2, 3, 4, 5, 6, 7, 8, 9, 10 స్వరాల **ఖండములు** తోనూ, మధ్య మధ్య 2, 3, 4, 5, 6 స్వరాల **విరామములతోనూ** కూర్చబడి ఉంటాయి. కాంభోజి రాగంలో ఆదితాళవర్ణంలో గమనించండి :

2 2 2 4 4 7 5

షా ధా సా రి ని ధ ప ధ స రి గ మ మ గ గ రి రీ స మ గ రి గ

6

స రి నీ ధ ప । — మొత్తం 32 అక్షరాలూ

2, 2, 2, 4, 4, 7, 5, 6 స్వరాల ఖండములలో ఉన్న నిర్మాణం కనిపిస్తుంది.

ఇదేవిధంగా ఖండచాపు ఆవర్తములో 10, చతురస్ర రూపకం ఆవర్తములో 12, మిశ్రచాపు ఆవర్తములో 14, స్వరాలూ చిన్నచిన్న ఖండములతోనే ఏర్పడి ఉంటాయి.

ఈ ఖండాలను విరామ రహితంగానూ విరామసహితంగానూ వేరే వ్రాసి చూద్దాం :

**2 అక్షరాలున్న ఖండాలు**

స రి

మ గ

మ మ

పా

**3 అక్షరాల ఖండాలు**

స ని ద

ద ద ప

ప మ మ

సా ని

రి సా

సా,

**9 స్వరాల ఖండాలు**

గా̇ రి̇ గ̇ రి̇ స̇ ని ద
గా̇ రీ̇ సా̇ నీ ద

**10 అక్షరాల ఖండాలు**

గ̇ రి̇ స̇ నీ గ̇ రి̇ స̇ ని ద
సా̇ సా̇, రి̇ స̇ ని ద ని

ఈ స్వరఖండాలు ఆరోహణ, అవరోహణ క్రమములలోను జంట, దాటు స్వరాలతోనూ, విరామములతోనూ ఏర్పాటు చేసి ఉంటే చాలా ఉపయోగం.

# మొదటి పాఠం

పై వ్రాసిన 3, 4, 5, 6, 7, 8, 9, 10 స్వరఖండాలను ఒక్కొక్కటిగా తీసుకుని విద్యార్థిచేత పాడించడమే మొదటిపాఠం. మొట్టమొదట 3 అక్షరాల స్వర ఖండాలను తీసుకుందాం.

శంకరాభరణరాగం. చతురశ్ర రూపకతాళం. 4 ఆవర్తాల పరిమితి, ఒక్కొక్క విన్యాసానికి 4 ఆవర్తాల చొప్పున 3 అక్షరాల ఖండాలు వ్రాసి విద్యార్థి చేత పాడించాలి.

1. స రి గ రి|గమ గమ|ప మ ప ద || దపమ గ|సరి గమ|ప నిదప||
   ద ని స̇ ని|దప మద|ప. పమగ || మపద ని|దప దని|స̇ నిరి̇స̇||
2. దాప మ|, గ మా|ప నీద || సా̇ని రి̇|, స̇ గా̇|రి̇ నీస̇ ||
   సా̇ద ని|, ప దా|మ పా మ || గామ ప|, మ గా|రి సాస ||
3. పదా మ|పా గ మ|, రిగా || మపా ద|నీ స̇ రి̇|, నిసా̇ ||
   రి̇ నీ స̇|దా ని ప|, దపా || మపా మ|గా మ గ, రిసా ||
4. సా̇, ని|; దా|, పా, || సీ, ద|; పా|, మా, ||
   గా, మ|; పా|, మా. || గా, రి|; నీ|, సా, ||

ఈ మోస్తరుగా 4 ఆవర్తాల పరిమితిలో 3 అక్షరాల ఖండాలు పాడడం వచ్చాక 8 ఆవర్తాల వరకూ ఈ 3 అక్షరాల ఖండాలను 1 వారం రోజులపాటు పాడించాలి విద్యార్థిచేత.

3 అక్షర ఖండాలు పాడడం క్షుణ్ణంగా వచ్చిన తరువాత 3 అక్షరాల తరువాత 2, 3, 4 అక్షరాల విరామములతో స్వరాలు వ్రాసి విద్యార్థికి నేర్పి పాడించాలి—దశాంశం తరువాత వచ్చే అంకె విరామం.

**3.2** శంకరాభరణంలో

రి̇ స̇ ని . సా̇ | స̇ ని ద . నీ | ని ద ప . దా | ద ప మ . పా

### 3.3

ప ద ప . మా, ప మ గ . రీ, | మ గ రి . సా, | గ రి స . రీ ,
నీ ద . పా, | పా మ . గా, | పా ద . పా, | దా ని . సా,
ని దా . పా, | ద నీ. సా, | గ రీ . సా, | సనీ. దా, | ద పా మా,|

### 3.4

రి స ని . దా; | స ని ద . పా; | ద ప మ . గా; | మ గ మ . పా;
ద ని స . రీ; | గ రి స . నీ; | స ని ద . పా; | మ గ రి . సా; |

ఈ విధంగా విరామములతో కూడిన 3 అక్షరాల ఖండాలను క్షుణ్ణంగా వేరే వేరే రాగాలలో పాడడం వచ్చేవరకూ – కనీసం 2, 3 వారాల పర్యంతం సాధకం చేయించాలి గురుముఖంగా. ఈ విరామసహిత ఖండాలను ఒక్క ఆది తాళములోనే గాక ఖండచాపు, రూపక, త్రిస్రత్రిపుట తాళాలలో కూడా సాధకం చేయించాలి.

ఈ విధంగానే 4 అక్షరాల ఖండాలు-
స ని ద ప | మ ద ప మ | ప మ గ మ | రి గ మ ప |
ద ప మ గ | మ ప ద ని | స ని ద ప | ని ని ద ప | ద ప మ ప |
దా ప మ | గా మ ప | మా ద ప | నీ ద ప | సా ని ద | రీ స ని |
ద నీ స | రి సా ని | స దా ప | మ గా మ | ప దా ని | స నీ స |
ద ప మా | ప మ గా | మ ప గా | మ రి గా | మ ద పా | ని ద పా
దా, ప | మా, ప | గా, మ | రీ, గ | మా, ప | దా, ని |
పా; | మా; | పా; | గా; | మా; | పా; ||

ఈ నాలుగు స్వరాల ఖండాలు రూపకతాళంలోనూ ఆది తాళములోనూ సమజాగానుంచి పాడితే బాగుండదు 2 అక్షరాల జాగాతో పాడిస్తే బాగుంటుంది. ఖండ, మిశ్రచాపు తాళాలలో సమం నుండి పాడించవచ్చు.

పై పాఠం క్షుణంగా పాడించిన మీదట 2, 3 అక్షరాల విరామములతో సహా 4 అక్షర ఖండాలను పాడించాలి.

### 4.2

(కల్యాణిరాగం)

గ రి స ని . సా | రి స ని ద . నీ | స ని ద ప . దా | ని ద ప మ . పా
మ ని ద ప . మా | ని ని ద ప . దా | స స ని ద . నీ | రి రి స ని . సా |

నీ ద-ద . పా | దా ద ప . మా | ప ప మ గ . రీ | మ మ గ రి | సా |

ప దా ని . దా | ని సా రి . సా | గ రీ స . నీ | స నీ ద . పా |

## 4.3 (కల్యాణిరాగం)

స ని ద ప దా, | రి స ని ద . నీ, | గ రి స ని . సా, | ప ద ని స . నీ, |

ని ద ప మ . పా, | ద ప ద నిదా, | ని ని ద ద పా, | ద ప మ ప . దా, |

ప గా మ . పా, | ని దా ప . దా, | స దా ని . సా, | రి గా రి . రీ, |

స స రి ని . సా, | ని స ని ద . నీ, | ని ద స ని . దా, | ప స ని ద . పా, |

ద మ ప ద . నీ, | ని రి ని ద . పా, | స ని ద ప . గా, | ప గా రి . సా, |

నాలుగు అక్షరాలు విరామ సహితంగా బాగా సాధకం చేయించిన తదుపరి 5 అక్షరాల ఖండాలను విరామరహితంగానూ, విరామసహితంగానూ పాడించాలి.

## 5 అక్షర ఖండాలు (తోడిరాగం)

స ని ద ప మ | ని ద ప మ ప | ద ప మ గ మ | ప ని ద ప ద | రి స ని ద ని |
సా రి స ని | రీ స ని స | దా ని స ని | దా ప మ ప | గా మ ప ద | నీ ద ప మ |
ద పా మా | ప మా గా | మ పా మా | గ రీ సా | రి గా మా | ప దా పా |
గా మా ప | మా పా ద | పా దా ని | దా నీ స | నీ ద ద ప | దా ద ప మ |
దా పా, | నీ దా, | సా నీ, | రీ సా, | దా నీ, | రీ సా, | గా రీ, ||

## 5.1

గరిసనిద. , | రిసనిదప. , | సనిదపద. , | దపమగమ. , |

సపమగమ. , | నిదపదని. , | సనిదనిస. , | రిరిసనిస. , |

రీసనిద. , | సానిదప. , | దానిసరి. , | పాదనిస. , ||

## 5.2

సరిసనిద. నీ | నిరిసనిద. పా | దనిదపమ. గా | మగరిసస. సా |

పమగరిగ.మా | నిదదపమ.పా | దనినిదప.దా | రిసనిదని.సా |
గరీసని.సా | రిసానిద. నీ | సనీదద.పా | దపామగ.మా |
పదనినిద.పా | సరినిసద. నీ | రిరిసనిరి.సా | మపదదని.సా ||

### 5.3 (తిరగవేసి 3.5 పాడితే బాగుంటుంది

సా,.రిసనిదప । దా,.నిదదపమ । గా,.మనిదపమ ।
పా,.సనిదపద । నీ,.దనిసరిస । రీ,.గరిరిసని ।
సా,.రిసనిద । సీ,.సానిదప । దా,.సీదపమ ।
పపా.దనిదపద । నిసీ.రిసనిదని । సరీ,.గరిసరిని ।

### 5.4 (ఆదితాళం)

గరిసనిద—సీ; । రిసనిదప—దా; । సనిదపమ—పా; ।
నిసిదపమ—పా; । దపమగమ–పా; । దనిదపద—నీ; ।
సగరిస–రీ; । సారిసని – సా; । సీదనిస—నీ; । దాపనిద–పా; ।
దాదపమ—గా; । మాపనిద–పా; । దాపదని–సా; । సానిదని–సా; ।

ఐదులన్నీ విరామ సహితంగా పాడించి సాధకం చేయించిన తరువాత ఇదేవిధంగా 6 అక్షరఖండాలు విరామాలతోనూ, లేకుండానూ వ్రాసి పాడించాలి.

**ఆదితాళం** 6 అక్షరాలు (తోడిలో)

రిసానిదప । ససీదపమ । దపామగరి । గమాపదప ।
మాపదనిస । పాదనిసరి । నీసరిగరి । సారిగరిస ।
సనిదపాద । నిదపమాప । దపమగారి । గపమగారి ।
సీ,సరిగ । పా,రిగమ । పా,నిదప । దా,నిసరి । సా,గరిస ।
రిసనిదా, । సనిదపా, । మపదనీ, । పదనిసా, । గరినిసా, ।

**ఆదితాళం** 6.3

గరిసనిద.సీ, । రిసానిదప.దా, । సనీదపమ.పా ।
దపామగరి.గా । మపాపమగ.రీ, । మగాగరిని,సా, ।
సాగరిసని.సా, । సారిసనిద.నీ, । నీసనిదద.పా, ।
దాదపమగ.మా, । పాపమగరి.సా, । రీగమగరి.గా, ।
పా,దపమ.పా, । సీ.దపద.నీ, । సా,గరిని.సా, ।

ఆదితాళం 6.4

సరీసనిద.నీ; | రిసాసనిద.పా; | నిదాదపమ.పా ; |
మగారిగమ.పా ; | నిదాపదని.సా; | మపాదనిస.రీ; |

ఇదే మోస్తరుగా 7 అక్షరాల ఖండాలు, విరామ సహితంగా కూడ పాడించాలి.

## 7 అక్షరాలు

గారీసనిద | రీసానిదప | సానీదపమ | పామాగరిస |
నిసగారిగమ | పనిదాపగమ | పదనీదనిస | గరిగాగరిస |
నీదానిసరి | సానీనిదప | దాపామపద | నీదాదపమ |
గామాగరీ | గామాదపా | నీదాపదా | నీసాగరీ |
సా;సనిద | నీ;దపమ | పా;మగరి | గా;గరిస |
నిసారిగమా | పమానిదపా | సనీదపమా | పదాదనిసా |

## 7.2

సారీసనిద.నీ | నీసానిదప.దా | సానీదపమ.పా |
దాపామగమ.పా | గామాపదని.దా | దానీసరిని.సా |
సనిదాపదని.సా | రిసనీదపమ.పా | దపమాగరిరి.సా |
సరిగామపగ.మా | పదనీదపద.నీ | సనిదాపదని.సా |

## 7.3

గారీసనిద.నీ, | రీసానిదప.దా | సానీదపమ.పా, |
నీదాపదని.దా, | దానీసరిని.సా, | సానీనిదప.దా, |
సాగరిసనిద.నీ, | నీసనిదపమ.పా, | దాదపమగమ.పా, |
నీనిధపదని.సా, | రీగరిసనిద.నీ, | సాసనిదపమ.పా, |

## 7.4

గారీసనిద.నీ; | సానీదపమ.పా; | దానీదపమ.గా; |
మానీదపమ.పా; | దానీనిదప. దా; | దానీసరిని.సా; |

మపదాదపమ.గా; । పమగాగరిరి.సా; । గామాదపమ.పా; ।
పదనిదదపమ.పా; । దనిసేరిసనిద. నీ; । సగరిసనిదని.సా;

## 8 అక్షరాలు (తోడిరాగం)

8 అక్షరాల ఖండాలు 3, 5 గా గాని, 4, 4 గా గాని, 2, 6 గా గాని ఏర్పాటు చేసుకోవచ్చు.

సా,గరిసనిద । నీ,సనిదపమ । పా,నిదదపమ । గా,దపమగరి ।
ససా.రిగరిసరి । గమా పనిదపమ । పదా నిసనిదప । దదా నిరిసనిద ।
సరిగ.గరిసనిద । నిసరి రిసనిదప । సనిద నిదదపమ । పదపగామపద ।
నీ,దానిసరి । సా,రీగరిస । నీ,రీరిసని । దా,సానిదప ।
సాసారిసనిద । నీనీసనిదప । దాదానిదపమ । దాపామపగమ ।
పా;దపమగ । మా;దపదమ । పా;దనిసరి । సీ;గరిసని ।

ఈ 8 స్వరాల ఖండాలు ఆది తాళములో స్వరకల్పనకు చాలా ముఖ్యం విద్యార్థి వీటిని బాగా సాధకం చెయ్యాలి.

8.1, 8.2, 8.3 కంటే 8.4 బాగుంటుంది.

## 8.4

ససాగరిసనిద.నీ; । సనీసనిదపమ.పా; । దపాదపమగరి.సా;
ససారిగమపద.పా; । మపాగామపద.నీ; । రిసారిసనిదని.సా;
సా,గరిసనిద.నీ; । నీ.సనిదపమ.పా; । దా,దనిదపమ.దా; ।
నిసరిసనిదపమ.పా; । దనిసనీదపమ.దా; । దపమపమగారి.సా;

9 అక్షరాల ఖండాలు 4, 5 చేర్చిగాని 2 2 2 2 1 గా గానీ పాడడం అలవాటు. ఈ రెండే ఎక్కువ ప్రచారంలో ఉన్నాయి.

## 9 అక్షరాలు

సా రి గ రి స ని ద । నీ ని రి స ని ద ప । మా పా ద ప మ గ మ ।
నీ దా ని ద ప ద ని । సా రీ రి స ని ద ప । దా ని స రి గ రి స ।

రీ సా నీ దా ప | సా నీ దా పా మ | గా మా పా దా ప |
నీ దా పా ద ప మ | దా పా మా గ రి స | రీ గా మా ప ద ప |

9 అక్షరాల తర్వాత, 1, 2, 3 విరామాల కంటే 4 అక్షరాల విరామం ఎక్కువగా వాడతారు.

## 9.4

సా రీ రి స ని ద ప . దా; | దా నీ స ని ద ప మ . పా; |
దా పా గ మ ప ద ని . దా; | దా నీ స రి గ రి ని . సా; |
సా రీ గా రీ స . నీ; | నీ సా రీ సా ని దా; | దా నీ సా నీ ద . పా; |
గా మా పా ద ని ద . పా; | పా దా నీ స రి స . నీ; | సా రీ సా ని ద ని . సా; |

## 10 అక్షరాల ఖండాలు

10 అక్షరాల ఖండాలను 5+5 గానూ 4+6 గానూ 3+7 గానూ పాడవచ్చు. 5+5 ఎక్కువ వాడుకలో ఉంది.

గా, రీ . గ రి స ని ద | రీ, సా రి స ని ద ప | సా, నీ స ని ద ప మ |
గా మా, ప ని ద ప ద | నీ దా, ని స రి రి స | నీ సా, రి గ రి స ని |
సా; గ రీ స ని ద | నీ; రి సా ని ద ప | దా; స నీ ద ప మ |
పా, దా పా మ గ రి | గా, మా పా ద ప మ | పా, నీ దా ప ద ని |

విరామ సహితంగా పాడేటప్పుడు 10 అక్షర ఖండాలకు 1, 2, 3, కంటే 4 అక్షరాల విరామం ఎక్కువగా వాడుకలో ఉంది 10 లు 5+5 గా పాడాలి.

## 10.4

గా, రీ గ రి స ని ద . నీ; | రీ, సా రి స ని ద ప . దా; |
పా, దా ప ని ద ప మ . పా; | దా, నీ స రి గ రి ని . సా; |
రీ సా, రి స ని ద ప . దా; | సా నీ, స ని ద ప మ . పా; |
నీ దా, ని ద ద ప మ . పా; | గా మా, ద ప మ గ రి . సా; |

ఈ విధంగా స్వరఖండాలను విరామ సహితంగానూ రహితంగానూ వ్రాసివ్వడం ఎవ్వరికైనా సాధ్యమవుతుంది. 3, 4, 5, 6, 7, 8, 9, 10 స్వరఖండాలను వేరేగానూ, విరామాలతోనూ 4, 5 ప్రసిద్ధ రాగాలలో, ఖండచాపు, రూపక, మిశ్రచాపు, ఆదితాళాలలో ఒక్కొక్క జాతి 10 ఆవర్తాలవరకూ క్షుణ్ణంగా విద్యార్థి పాడగలిగిన శక్తి రావడానికి సుమారు 6 నెలలు పట్టవచ్చును. స్వర కల్పనా జ్ఞానం రావడానికి ఈ మొదటిపాఠం పునాది వంటిది.

# రెండవ పాఠం

మొదటి పాఠం బాగా సాధకం చెయ్యడంవల్ల నోటికి స్వరాలు జాతులు జాతులుగా పాడడం అలవాటవుతుంది. తరువాత ఒక్కొక్క తాళమే తీసుకుని సమజాగాకీ, 2 అక్షరాల అనాగత జాగాకీ స్వరకల్పన అలవాటు చెయ్యాలి. ముఖ్య మైన 4 తాళాలలోనూ అంటే ఖండచాపు, చతురస్ర రూపకం, మిశ్రచాపు, ఆది తాళాలలో–స్వరకల్పనా పాఠాలు బోధిస్తే చాలు.

## చతు॥ రూపకతాళం

కల్యాణిరాగంలో "ఈశపాహిమాం" అనే కృతి సమజాగాలో స్వరం వెయ్యడానికి బాగుంటుంది.

| | |
|---|---|
| మొదటి కాలంలో– | స ని దా పా ప మ గా మా ॥ పా |
| **ఆవర్త** స్వరాలు– | ఈ . . శ పా . . హి ॥ మాం |

| | | |
|---|---|---|
| పా, ప ద ని । | ని ని ద ప ద ని । | ద ని ని ప ద ని । |
| ప మా ప ద ని । | ద ప ని ద గ రి । | గ ని ద ప ద ని । |
| గా మ ప ద ని । | గ గ మ ప ద ని । | గ రి స ప ద ని । |
| స ని ద ప ద ని । | స ద ని ప ద ని । | |
| మ పా దా ని । | రి గ మ ప ద ని । | |

ఈ విధంగా 1 ఆవర్తం స్వరాలు సులభమైనవి వ్రాసి గురువు పాడుతూ శిష్యునిచే పాడించాలి. కొంత అలవాటయ్యాక, గురువు తానొక ఆవర్తం స్వరం పాడితే శిష్యుడు వేరొక స్వరం పాడుతూ సాధకం చెయ్యాలి. తరువాత, ఇవే స్వరాలు చూడకుండా పాడించాలి విద్యార్థిచేత. మొదటికాలం పాడడం బాగా వచ్చాక మొదటి కాలంలోనే రెండు ఆవర్తాల స్వరాలు పాడించాలి.

2)

## 2 ఆవర్తములు-మొదటికాలం స్వరాలు

సా, స ని ప పె, ప ద ని || స ని దా పా పా, గ మా || పా ; ; ;
ఈ . . శ పా . . హి || మాం

గ రీ రి సా స నీ ప ద ని |

దా ప నీ ద సా ని ప ద ని |

స ని ద ని ప ప ద ప మ ప ద ని |

రి సా ని ద ప స సి ప ద ని |

రి స ని ద స ని ద ప మ ప ద ని |

రి సా ని స నీ ద ప దా ని |

సా, సి, దా, ప ద ని |

ని దా ప మా పె, ప ద ని |

సా ; ; పె, ప ద ని |

ద పె ని దా స సె ప ద ని |

గ మ ప ద ని స రి సా ప ద ని |

ప ద ని మ ప ద గ మా ప ద ని |

ద ని స ప ద ని స గ మ ప ద ని |

గ మా గ మ పా గ మ ప ద ని |

పె దా ని స ని ప ద ని |

స స సి ద సీ ని ని ద ప ద ని |

---

ఇవే కాకుండా ఇలాంటి స్వరాలు ఇంకా వ్రాసి, ఒక్కొక్క స్వరం రెండు మూడుసార్లు పాడిస్తే మంచి సాధకం అవుతుంది. పై వ్రాసిన స్వరాలనే రెండవ కాలములో ఒక ఆవర్తములో పాడించాలి.

ఒక ఆవర్తం స్వరాలు మొదటికాలంలోను, పై కాలంలోనూ అలవాటు చేశాక పై కాలంలో 2 ఆవర్తాల పరిమితిగల స్వరాలు పాడిస్తే స్వరకల్పన ఎలా నడుస్తుందో బోధపడుతుంది. అంతకంటే ఎక్కువ పరిమితిగల స్వరాలు పాడించే అవసరం ప్రస్తుతం లేదు.

## పై కాలములో 2 ఆవర్తాల స్వరాలు

సా, గ రి స ని ద నీ, రి । స ని ద ప దా, ప మ ప ద ని ॥
స సా గ రి స ని ద ని నీ రి । స ని ద ప ద దా గ మ ప ద ని ॥
గ రి గ రి స ని రి స రి స ని ద । స ని స ని ద ప ని ద ప దా ని ॥
గ రీ స ని ద పా, రి సా । ని ద ప మా, గ మా ప ద ని ॥
ప ద ని స రీ గ రి స ని ద ప । మ ప ద ని సా ద నీ ప ద ని ॥
గ రి స ని ద ప మ ప ద ని స రి । రి స ని ద ప మ రి గ మ ప ద ని ॥
గా రి స ని రీ స ని ద సా । ని ద ప నీ ద ప మా ప ద ని ॥
గా రి స ని సా రీ స ని ద । నీ సా ని ద ప దా ప ద ని ॥
సా సా, ని ద ప నీ దా । , ప మ ప దా పా మ ప ద ని ॥
స రి గ ని స రి ద ని స ప ద ని । మ ప ద గ మ ప ని ద ప దా ని ॥
పా, ద ప మ పా ని ద పా । స ని ద పా రి గ మ పా ద ని ॥

సమజాగా అలవాటైన తరువాత రూపకతాళంలో
1 అక్షరం జాగాకి స్వరకల్పన చేయించాలి.

మాయా మాళవ గౌళరాగంలో "తులసీదళములచే"
అనే త్యాగరాజకృతిలో చరణంవద్ద బాగుంటుంది.

; ప దా పా , పా పా ॥ ప మ ద ప ప ప మ మా గ మా ॥
.. స ర సీ .. రు హ ॥ పు . . . న్నా . . . . . ॥

; గ మా గ రీ సా రీ ॥ గా మా పా పా ప మ గ రి ॥ గ మ ప దా పా,
.. చం . ప క పా .. ॥ ట ల కు ర వ . క . ॥ . . స ర సీ,

మొదటి కాలంలో 1 ఆవర్తం స్వరాలు; 1 అక్షరం జాగా.

మా, గ రి గ ॥ మ
ప మా గ రి గ ॥ మ
ని ని ద ప మ గ ॥ మ
మ గ రి స రి గ ॥ మ
ద పా మా గ ॥ మ

స ని ద ప మ గ || మ

స మ గ రి గా || మ

మ ప గ మ రి గ || మ

స రి గ మ ప ద || మ

స̇ రి̇ స̇ ని ద ప || మ

ప దా మ ప గ || మ

నీ దా పా || మ

సా, స రి గ || మ

మొదటి కాలంలో 2 ఆవర్తాల స్వరాలు— 1 అక్షరం జాగా

పా, మ గ రి || సా, స రి గ || మ

ప పా మ గ రి || సా, స రి గ || మ

గ మా ప ద ని || సా̇ స̇ ని ద ప || మ

స̇ నీ ద నీ || ప దా మ ప గ || మ

గ మ ప ద ని స̇ || , ని ద ప మ గ || మ

ప పా మ పా || గ మా స రి గ || మ

గ̇ రి̇ స̇ ని ద || రి̇ సా̇ ని ద ప || మ

ప దా మ పా || ద పా ద ప ద || మ

గ మ ప ద ని స̇ || రి̇ సా̇ ని ద ప || మ

పా, మ పా || గ మ పా రి గ || మ

పా ప మా ప || గ మా ప ద ప || మ

రెండవ కాలములో 1 ఆవర్తపు స్వరకల్పన

పా, మా, మ గ రి సా రి || గ మ — స ర సీ రు హ....

ప దా మ పా గ మా రి స రి || గ మ

గ మా ప ద ని సా̇, స̇ ని ద || ప మ

సా̇ ని ద నీ ద ప ద పా మ || గ మ

స̇ నీ ద ప మ పా మ గా రి || గ మ

సా, రి గ మ పా, మ గ రి || గ మ

ప ద ని స రి ని సా స నీ ద || ప మ
గ మ ప మ ప ద ప ద ని స ని ద || ప మ
స రి గ మ ప ద ని సా స ని ద || ప మ
ని ని ద ద ని ని ద పా ని ద ద || ప మ
గా, మ పా, ద నీ, ద || ప మ
పా పా మ గ మా మా గ రి || గ మ
గ రీ స ని ద పా మ గా రి || గ మ
గ మ పా రి గ మ పా సా రి || గ మ
మ గ ప మ ద ని ద ప స ని ద || ప మ
ప ద ద మ ప ప గ మ మ రి స రి || గ మ
స ని ద ప మ గ రి స స నీ ద || ప మ – స ర సీ రు హ ...

## పై కాలములో 2 అవర్త స్వరములు

పామగరిస నిసరిగమప | గమాపదని సా,సనీద || పమ
పా, దపమపా, నిదద | పా, సనిదపా, మగరి || గమ
గమాగ మపామ పదాప | దనీద నిసారి సనీద || పమ
గా, మపదపా, నిదప | దా, సనిదనీ, సనిద || పమ
పమగరిసరి గమాపదప | దనీసరిసనిదా సనిద || పమ
పదా మపప గమా రిగమ | గమప మపద పదని సనిద || పమ
సా,రిసనిదప దా,స | నిదపమ పా, దపమగరి || గమ
ససారిగమ పా; రిరిగమపదా; సనీద || పమ
మగమ పాద పదనిసరీ | నిసాదనీ సనీదపమ || గమ
మగమ పా, దపదనీ, | సగరిసా, సనిదపామ || గమ
పాదపమగమా ; ; | మాపమగరిగా, రిసరి || గమ
పా, దపమ పాదమదప | మగమపాద పనిదపామ || గమ
మగరిసా పమగరిసా ద | పమగమప దనిసాసనిద || పమ
నిసనిదనిదపదమపగమ | రిగమపమదపనీదపమ || గమ
మా, పనిదపమదపాప | నిసనిదప మగరిస సారి || గమ

పా, దపమపా, మగమ | పా, నినిదపా, సనిద || పమ

పా; ; మపామగరి | సా; ; మగారిసరి || గమ

పా, మపా గమపా రిగ | మపా సనిదపా మగారి || గమ

గరిసనిదప మపదనిసరి | రిసనిదపమ | గరిస సారి || గమ

పమా దపమా నిదపమా | దనిదపమా సనీదపమ || గమ

---

ఈ స్వరాలే కాక ఈ మోస్తరు స్వరకల్పనలను గురువు వ్రాసి, ఒక్కొక్క నమూనా లాంటి స్వరములను వీలైనన్ని పాడిస్తే స్వరకల్పనా రీతులు శిష్యునికి బాగా నోటికి వస్తాయి. పదే పదే సాధకం చేయించడంలో ఉన్నది రహస్యం.

చతురస్ర రూపకతాళంలో చాలా ఆవర్తాల వరకూ స్వరకల్పన చేసేటప్పుడు 12 అక్షరాలు, అంటే ఒక ఆవర్తం స్వరాలు ముగిసిన వెంటనే గుర్తు తెలియాలి విద్యార్థికి; అనగా, ప్రతి ఆవర్తం దీర్ఘస్వరముతో ప్రారంభించ నవసరం లేదు, 12 అక్షరాల కొలతబద్ధతో పాడుతూ ఉన్న స్వరాలను కొలుచుకుంటూపోవాలి. వినేవారికి స్వరకల్పన ఆవర్తాలు ఆవర్తాలుగా వినబడకపోయినా, పాడుతూన్న విద్యార్థికి ఒక్కొక్క ఆవర్తం, లేక 2 ఆవర్తాలైనా సరే, ముగిసినట్లు గుర్తు తెలియాలి ఈ గుర్తు తెలియకపోతే జాగాకి వచ్చేటప్పుడు కంగారుపడే అవకాశం ఉంది. ఈ విధమైన గుర్తు తెలియాలంటే 12 అక్షరాల ఖండాలు రకరకాల చిరుఖండాల ఏర్పాటుతో వ్రాసిచ్చి సాధకం చేయించాలి :

| | | | | | |
|---|---|---|---|---|---|
| **మాళవగౌళ** | పా, మా, గా, రి గ మ \|\| | 3 | 3 | 3 | 3 |
| | ద పా ప ప ప గ మా రి గ మ \|\| | 3 | 3 | 3 | 3 |
| | పా, మ గ రి సా, రి గ మ \|\| | | 6 | 6 | |
| | ద పా మ గ రి స సా రి గ మ \|\| | | 6 | 6 | |
| | ద పా మ గ మా రి స రి గ మ \|\| | 4 | 3 | 5 | |
| **కళ్యాణి** | రి స ని ద స ద ప మ ప ద ని \|\| | 4 | 4 | 4 | |
| | సా ; ; పా, ప ద ని \|\| | 6 | 3 | 3 | |
| | ద పా ని దా స నీ ప ద ని \|\| | 3 | 3 | 6 | |
| | గ మా గ మ పా గ మ ప ద ని \|\| | 3 | 4 | 5 | |
| | ప ని స ప ద ని స గ మ ప ద ని \|\| | 3 | 4 | 5 | |

గ మా గ మ పా మ పా ద ని || 4 4 4

స̇ రి̇ ని స̇ ద ని ప ని ద ద ప మ || 2 2 2 2 4

రీ̇ స̇ ని ద సా̇ సీ ద ప మ || 5 7

గ̇ రి̇ స̇ ని సా̇, స̇ ని ద ప మ || 4 3 5

ఇంతటితో రూపకతాళం పాఠం ముగుస్తుంది. సమజాగాకి, ఒక అక్షరం జాగాకి, 1 ఆవర్తం, 2 ఆవర్తాల స్వరాలు మొదటి, రెండవ కాలములలో నోరు నొచ్చేలాగ విద్యార్థిచేత సాధకం చేయిస్తే స్వరకల్పన తనకు తప్పక స్వాధీనమవుతుందనే ధైర్యం కలుగుతుంది.

# మూడవపాఠం

## ఖండచాపు తాళం

రూపకతాళం తర్వాత ఖండచాపు తాళం పాడించడం సులభం. కల్యాణి రాగములో "అమ్మ రావమ్మ" అనే త్యాగరాజకృతి ఇందు కనువైనది. ఈ కృతిలో పల్లవి వద్ద సమజాగాకే, చరణంలో 1 అక్షరం జాగాకి కూడా స్వరకల్పన చేసే సౌకర్యం ఉంది.

ఈ కృతిలో పల్లవి ఇలా నడుస్తుంది :

సా ; స ని ద ప పా మ || ప ద ని సా ; ; ||
అ . మ్మ . రా . . . || వ.......మ్మ.......||

### మొదటి కాలములో ఒక ఆవర్తం స్వరాలు

పా ప ద ని || సా ; స ని ద ప పా మ || ప ద ని సా ; ;
అ . మ్మ . రా . . . || వ . . మ్మ.

గ మ ప ద ని ||
స ని ప ద ని ||
పా దా ని ||
ని ప దా ని ||
సా ప ద ని ||
ద మ ప ద ని ||
స పా ద ని ||
నీ దా ని ||
ద ద ప ద ని ||
మ ప ద ద ని ||
స ని ద గ రి || రి స సా స ని దా పా || ప ద నీ సా ; ;
మ ప ద ద ని || అ.......మ్మ....రా.... || వ..... మ్మ....

## సమజాగా, మొదటి కాలములో 2 ఆవర్తాల స్వరాలు

దా ప మ ప గ మ ప ద ని ॥
సా ని దా ప మ ప ద ని ॥
ని ద పా, గ మ ప ద ని ॥
ప మ పా గ మా ప ద ని ॥
పా, గా మా ప ద ని ॥
ప మ ద పా ని ని ప ద ని ॥
సా, నీ, ద ప ద ని ॥
ప మ గ రి గ ని ద ప ద ని ॥
ద ని ప ద మ పా ప ద ని ॥
సా స ని ద పా ప ద ని ॥
ద పా ని దా మ ప ద ని ॥
స స ని ద ని ని ద ప ద ని ॥
స నీ ద ద పా ప ద ని ॥
పా, ద పా, ప ద ని ॥

## సమజాగా, రెండవ కాలములో 1 ఆవర్త స్వరాలు :

పా ; , గ మ ప ద ని ॥
సా; స నీ ప ద ని ॥
రీ , గా మా ప ద ని ॥
స నీ ద ప మా ప ద ని ॥
గ రి స ని ద పా ప ద ని ॥
స రి ని స ద ని ప దా ని ॥
స నీ ద పా ప దా ని ॥
ద ప ని ద స ని ద ప ద ని ॥
స ని ద ని ద పా ప ద ని ॥
ని ని ద ప ద ద ప ప ద ని ॥

3)

సా, ని దా, ప మ ని ||

స ని ద పా గ మ ప ద ని ||

## సమజాగాకి 2 వ కాలములో 2 ఆవర్తముల స్వరములు

సాసనిద నినిదప పాపమప గమపదని || అమ్మరావమ్మ

సరిగనిసరి దనిస పదని మపద గమపదని ||

పమపాపమ నిదపమ సనిదప రిసని పదని ||

సా, గరిసనిదని, రిసనిదపా పదని ||

పామపాప నిదసాని రిసనిపదని ||

సరిగరిస నిసరిసాని దనిసని పదని ||

ససనిదని; నినిదప పా; మపదని ||

సానిదా నినిదపా పాపమా గమపదని ||

సానా నిద నినిదప పాపా పదాని ||

సరిగరీ, దనిసని, పదనిదా పదని ||

సరిసనిదా నిసానిదపా పమాపదని ||

పమగపపమ నిదప సనిద రిసని గమపదని ||

## చాలా ఆవర్తములు పాడేటప్పుడు పనికివచ్చే 10 అక్షరాల కూర్పులు

### కల్యాణిలో

పా, ప ప మ గ రి గ మ ||

ని పా మ పా ని ద ప మ ||

ప ప మ గా రి గ రి స ని ||

స రి గ మ ప గా మ ప ద ||

మ ప ద ప స ని రి స ని ద ||

స రీ స ని ద రి స ని ద ||

సా సా ని ద ని ద ప ||

సా ని ద నీ, ని ద ప ||

పా ప నీ ద సా ని ద ||

మ ప ద మ ప గా మ ప ద ||

ప ని ద పా నీ ద ప మ ||

ప మ ద ద ప మ గ రి గా ||

ప మా గా రి స ని ధ ని ||

స రి గ మ ప రి గ మ ప ద ||

ద ని స ప ద ని మ ప ద ని ||
ప ద ని సా గ మ ప ద ని ||
గ మ ప మా ప మ ప ద ప ||
నీ ద ప స ని ద రీ స ||

గ రి గ స రి ని స ద ని స ||
సా స ని ద ని ని ద ప ||
స రి గ స రి ని స ద ని ద ||
స రీ ని సా ద ని ప ద ||
ని రి స సి, ద ప మ గ ||

## ఖండచాపుతాళంలో 1 అక్షరం జాగాకి స్వరకల్పన

"అమ్మరావమ్మ" అనే కృతిలోనే చరణంలో "తామరస దళనేత్రి" అనే చోటు కల్పనకు అనువైనది.

; సా స ని దా పా || ప గ మా పా ; పా ||
. తా మ . ర స || ద . ళ నే . త్రి ||

; పా ప మ ప దా ప || ప ద నీ సా ; మ ప || ద ని
. త్యా గ . రా . . || జు . ని మి . త్రి . || . .

## మొదటి కాలంలో 1 ఆవర్తం స్వరకల్పన

పా, ప ద || ని
గ మా ప ద || ని
ని ని ద ప ద || ని
రి గ మ ప ద || ని
ని ద ప దా || ని
ని ద మ ప ద || ని
ప గ మ ప ద || ని
ద ని స ప ద || ని

సా పా ద || ని
స ని స ప ద || ని
ప ప ద ద ని || ని
గ రి స ని ద || ని
ని ద ని ప ద || ని
సా మ ప ద || ని
ద ప ని ద స || ని
స పా ప ద || ని

## మొదటి కాలములో 2 ఆవర్తముల స్వరకల్పన

పా, మ గ | మ పా ప ద || ని
ని ద ప మ ద | పా మ ప ద || ని

పాదపా । నిదపాద ॥ ని
గమపదని । సామపద ॥ ని
సరీనిసాపసిపద ॥ ని
పమదపానిదాపద ॥ ని
మగమపద । పాదపద ॥ ని
దసిపద । నిమపద ॥ ని
గమపమప । దపదనిద ॥ ని
సాపాద । పామపద ॥ ని
దనిసరీ । పదనిసద ॥ ని
పమగదప । మనిదపద ॥ ని
సనిదపమ । గమాపద ॥ ని
గగమపమ । మపదపద ॥ ని
పాదపా । నిదపాద ॥ ని
నిదపమాగమాపద ॥ ని
సనిదపమ । గమాపద ॥ ని
సానిసీ । దదాపద ॥ ని

## పై కాలములో 1 ఆవర్త స్వరా

సా, సనిదపా, ప ॥ దని
గా, మా, పా, ప ॥ దని
సానిదసిదపమప ॥ దని
సారిసనిదాపమప ॥ దని
పదానిసాదసీప ॥ దని
సాగరిసనిదపాప ॥ దని
సనిదపమగరిగమప ॥ దని
రిసనిదపాగమాప ॥ దని
పదనిసాదనిసాప ॥ దని
నిదపమాగమపాప ॥ దని

రీ స ని ద గ మా ప || ద ని
గ మ ప ద ని సా గ మ ప || ద ని
స నీ ద ని దా మా ప || ద ని
ప ద ని స ని ద ప మా ప || ద ని
రి సా ని ద ప స నీ ప || ద ని
ని గ రి స ని ద ప మా ప || ద ని

## పై కాలములో 2 ఆవర్త స్వరకల్పన

సా, స ని ద నీ, ని | ద ప దా, గా మా ప || ద ని
స రి గ ని స రి ద ని స ప | ద ని మ ప ద గా మా ప || ద ని
పా, ద ప మ ప దా ప | ద ని సా స ని ద ప మ ప || ద ని
సా, గ రి స ని ద నీ | , రి స ని ద ప దా, ప || ద ని
స రీ ని సా ద నీ ప | దా మ పా గా మా ప || ద ని
మ ప ద ని సా, రి స ని | ద ని ని ద పా, గ మ ప || ద ని
సా ని ద ప మ గ రి గా | నీ ద ప మ గ రి గ మ ప || ద ని
స స ని ద నీ, ని ద ప | దా, ద ప మ పా, ప || ద ని
గ మ ప మా ప మ ప ద ప || నీ ద ప స ని ద ప మ వ || ద ని
స రీ గ రి స ని స రీ | స రి ని స ద నీ దా ప || ద ని
ద ని స రి గ రీ స ని ద | రి సా ని ద ప గ మా ప || ద ని
గా రీ స ని ద నీ, | రీ సా ని ద ప మా ప || ద ని
ప మ ప దా ప నీ ద ప | రి స ని ద స నీ దా ప || ద ని
సా ని ద ప మ గ రి సా | గ మ ప ద ని సా మా ప || ద ని

---

చాలా ఆవర్తాల స్వరకల్పన చేసేటప్పుడు స్వరాలను తాళానికి అనుగుణంగా పదులు పదులుగా కల్పన చేయడం నేర్చుకోవడం చాలా అవసరం.

| | |
|---|---|
| పా, ద ప మ గ రి గ మ | నీ ద ప సా ని ద రి స |
| ద దా మ పా ని ద ప మ | మ ప ద మ ప గా మ ప ద |
| ప ప మ గా రి గ రి స ని | ప ని ద పా నీ ద ప మ |

స రి గ మ ప గా మ ప ద

మ ప ద ప స̇ ని రి స̇ ని ద

గ̇ రీ̇ స̇ ని ద నీ ద ప

సా̇ సా̇ ని ద ని ని ద ప

ద ని స̇ ప ద ని మ ప ద ని

గ మ ప మా ప మ ప ద ప

స̇ రి̇ గ̇ రీ̇, స̇ ని ద ప

గ̇ రి̇ గ̇ స̇ రి̇ ని స̇ ద ని స̇

సా̇ స̇ ని ద నీ ని ద ప

పా, ద పా, ని ద ప

స̇ రి̇ ని స̇ ద ని స̇ ప ద ని

పా ద పా ని ద స̇ ని ద



## నాలుగవ పాఠం

## మిశ్రచాపు తాళం

మిశ్రచాపులో సమజాగాకి స్వరకల్పన చెయ్యడానికి "భజరేరేచిత్త" అనే దీక్షితులవారి కల్యాణి రాగ కీర్తన తీసుకుందాం.

గా , మా , । పా ; ; ; । ప మ గా ; । గ రి గ రి రి స సా ।
భ . . . । రే . . . । రే . . . । చి . . . త్త . . ।

; గ రి స ని । సా రీ సా రీ । గా ; ; । గ ద ప మ గ రి స రి ।
. జా . . . । లాం. . చి । కాం . । . . . . . . . . ।

### మొదటి కాలంలో 1 ఆవర్తం స్వరాలు

పా, ప మ గ రి ॥ భజరే ॥ మ ద ప మ గ మ రి ॥
పా మా గ మ రి ॥ ని దా ప మ గ రి ॥
స ని ద ప మ గ రి ॥ గ రి ని ద మ గ రి ॥
ప ద మ ప గ మ రి ॥ రి గ ప మ గ మ రి ॥
ద ప ద ప మ గ రి ॥ ని ద ద ప మ గ రి ॥
స రి గ మ ప గ రి ॥ పా; మ గ రి ॥
మ ని ద ప మ గ రి ॥ గ ని ద మ గ మ రి ॥
స రి గ మా గ రి ॥ పా మా గా రి ॥
మ గ రి స రి గ రి ॥ సా పా మ గ రి ॥
ద పా మ గ మ రి ॥ మ ద ప గ మ గ రి ॥ భజరే

ఈ మోస్తరుగా స్వరాలను వ్రాసి ఒక వారం రోజులు సాధకం చేయిస్తే మార్గం బోధపడుతుంది.

సా ని ద నీ ద ప ద పా మ గ రి ||
ద ని స దా; ప ని ద ప మ గ రి ||
సా నీ ద ప మ దా పా మ గ రి ||
గ రి స ని ద రి స ని ద ప మ గ మ రి ||
పా, ద ప మ గ ద పా, మ గ రి ||
ప మ ద ప ని ద స ని ద ద ప మ గ రి ||

## రెండవ కాలములో 2 ఆవర్తాల స్వరకల్పన (సపుజాగా)

పా,దపమ గమపదని దపమ | పా,దనిససనిద దపమగరి ||
సానిద నీదప దపామగరి | గమపదనిసా; దపమగరి ||
గా,గరిసరీ రిసన్నిధన్ని | సరీగమా పదా దపమగరి ||
సా,గరిగ సగరి రిసనిదని | సనిద సీద పదాదపమగరి ||
పా,మగమ పా, నిదపదా | సా,రిసనిదా, పమగమరి ||
సరిస పమగ దపమ నీదపమ | సనిదరిసనిగరిస సనిదపపు ||
మగారిసన్నిసా, పమగమరి | గనీదపమపా, నిదదపమ ||
పామగరిసన్నిధా న్నిసరిగమ | పానిద సనిదపాదపమగరి ||
పదదప మపపమ గమాపదప | నినిద సనిద రిసని దపమగరి ||
పామాగరిస న్నీధానిసరి | గామా పదప నీదా దపమ ||
ససనిద నినిదప నిదాదపమ | గామప నిదసని దపామగరి ||
సరీగమప గమపద మపదని | గరీసనిద సనిద దపమగరి ||

---

14 అక్షరాల కాలప్రమాణం మనసులో నాటుకుపోతే చాలా ఆవర్తాల స్వరకల్పన. చాలా సులభమవుతుంది. అందుకుగాను ఈ క్రింది స్వరాలను బాగా పాఠం చెయ్యాలి.

పా, ద ప మ గా, మ ప ద ప మ ||
ప ద ప మ ప మ గ ప మ గా రి స న్ని ||
సా రి గా మ పా ని దా ద ప మ ||
నీ ద ప ద మ ప ద ని స రీ స ని ||

4)

ప ద ని సా ర సని ద పా మ గ రి || గ మ
సా ని ద నీ ద ప ద పా మ గ రి || గ మ
గ మ ప మా ప మ ప ద పా మ గ రి || గ మ
పా పా మ గ మా గా రి సా రి || గ మ
గ మ ప ద ని స రి సా నీ ద ప మ || గ మ
రి గ మ ప ద ని స రి స ని ద పా మ || గ మ
ప మ గ రి సా రి స ని ద పా ని ద || ప మ
పా, మ గా, రి సా, ని స రి || గ మ
పా మ గా, మ ప మ గా రి స రి || గ మ
రి స ని దా, స ని దా, నీ ద || ప మ

## 2 ఆవర్తాలు, మొదటికాలపు స్వరకల్పన

స ని ద పా ని ని ద పా మ గ రి గ || మ
ప మ గ మ రి గ మ ప ని ద పా మ గ || మ
పా మ గ మ పా రి గ మ పా మ గ || మ
గ మ ప మ ప ద ప ద ని స ని ద ద ప || మ
స రి గ మ గ రి స ని ద ప మ గ రి గ || మ
స స రి ని ని సా స ని ద పా మ గ || మ
పా మ గ రి సా నీ ద పా మ గ || మ
గ మ ప దా మ ప ద నీ స ని ద ప || మ
ద ప ద మ ప గ మ ప ని ద పా మ గ || మ
పా మ పా గ మ ప దా ని ద ద ప || మ
ద ని స రి స ని రి స ని ద పా మ గ || మ
ప ద ని స రి ని స ద ని స ని ద ద ప || మ

పై కాలములో 2 ఆవర్తపు స్వరాలు ఈ విధంగానే అధ్యాపకులే వ్రాసిచ్చి విద్యార్థిచేత పాడించవచ్చును. వ్రాయసక్కరలేకుండానే తాను పాడి విద్యార్థిచేత పాడించినా మంచిదే. వ్రాయవలసిన అవసరము ఉండదనే భావనతో 2 ఆవర్తపు స్వరాలు పై కాలములో వ్రాయలేదు. ఇంతవరకూ పాడిన విద్యార్థి/విద్యార్థిని 2 ఆవర్తముల స్వరకల్పన సులభముగా చేయగలడు/దు.

## ఐదవపాఠం

## ఆదితాళం

ఒక విధంగా, గడచిన తాళాలలో కంటె ఆదితాళముతో స్వరకల్పన చెయ్యడం కష్టం. ఖండచాపు, రూపకం, మిశ్రచాపు తాళాలలో, ఆ తాళము నడకే స్వరకల్పనా రీతులను సూచిస్తుంది. ఆదితాళము సరిసంఖ్య, 32 అక్షరాల ఆవర్తము. కనుకనే ఈ కష్టం. ఆ కారణంచేత ఆదితాళము చివరగా తీసుకోవడ మైనది.

కృతి — శంకరాభరణ రాగములో "సరోజదళనేత్రి" అనే కృతిలోని చరణమువద్ద స్వరకల్పన —

పా ; ; ద స ద పా , పా ప మ | పా దా పా స ని | ద పా , ప మ గా ||
సా . . మ . గా . . న వి . | నో . . ది . | ని . . గు . ణ ||

మా ప ద పా మా గా మ ప మ గ రి | గా మా పా గ మ || పా ; ; ; ||
దా . . . మ శ్యా . . మ . . | కృ . ష్ణ ను . || తే . . ||

### మొదటి కాలములో ½ ఆవర్తపు స్వరాలు

పా, మ గ రి గ మ ||
ద పా గ మ రి గ మ ||
సా, పా మ గ మ ||
స ని ద పా మ గ మ ||
గ మ ప గ మ రి గ మ ||
స రి గ మ ప రి గ మ ||
ద పా మా గా మ ||
ప దా మ పా గ మ ||
పా, సా రి గ మ ||
ప మా గ మ రి గ మ ||

ప మ ప గ మ రి గ మ ||
ప ద మ పా మ గ మ ||
ని ని ద పా రి గ మ ||
ద ప ద మ ప రి గ మ ||
గ రి గ సా రి గ మ ||
ప ద ద మ ప ప గ మ ||
రి స ని ద ప మ గ మ ||
ప మ గ మ గ రి గ మ ||
ద ని ప ద మ ప గ మ ||
ప ప మ గ మ రి గ మ ||

## మొదటి కాలములో (క్రియకు 2 అక్షరాల నడక)
## సమజాగాకి 1 ఆవర్తపు స్వరాలు

పా, మ గ రి గా, మ గ రి స రి గ మ ॥ సామగాన....
గ మ ప మా గ రి గ మ గా రి స రి గ మ ॥
మ గ రి సా, స ని ద పా మ గ రి గ మ ॥
ద పా మ గ రి గా; రి సా రి గ మ ॥
ద ప మ ప మ గ మ గ రి మా గా రి గ మ ॥
స రి గ మ ప ద మ పా మ గ మా రి గ మ ॥
ద ని స దా ప మ గ రి గ రి సా రి గ మ ॥
రీ స ని ద సా ని ద ప ద పా మ గ మ ॥
ప పా ద ప మ గ రి గ గా మ గ రి గ మ ॥
స రి గ రి గ మ గ మ ప ద ప మ గ రి గ మ ॥
ప మ ద ప ని ద స ని ద పా మ గ రి గ మ ॥
పా ; ; ప మ గ రి గ సా రి గ మ ॥

## రెండవ కాలములో 1 ఆవర్తపు స్వరకల్పన

పా,దపమగా, గమపదనిసరి–సనీనిదా దపాదాపామగమ ॥ సామగాన
గమపమాప మదపా, దపమగమ–పదనిసదా సనిదపా మగరిగమ ॥
గరిగసా, పామగమ రిగమపా–దనిసదాప మగరి గరిసా రిగమ ॥
పదాపమగ మపామగమ రిగమప–దనిసరీ సనిదపా మగమ రిగమ ॥
దపమగరీ మగరిసా గరిరిసన్ని సరిగమపదనిస రిసనిద పమగమ ॥
పా,మగమ పా, మపగమ రిగమ–పదనిసరీ సనిదపా మగరిగమ ॥
దపమగమ పమగరిగమగారిసన్ని-మగరిపమగ దపమ సనిదపమగమ ॥
పాదపమగ మాపమగరి గామగ–రిస రిగగరిసన్ని ససాసారిగమ ॥
రిసని సనిద నిదప సనిదప మగమ–పదనిస రిగరీ సనిదపా మగమ ॥
దాపమ గరిగా పగమ రిగసరిన్ని–సరిగమపా సనిదప మగరిగమ ॥
సా ; ; సనిదపా మగరిగమ–పా ; ; గమపగరి సారిగమ ॥
పామగామరిగ మపామ గమపద–సనిదా; సనిదపా మగరిగమ ॥

ప్రతీ ఆదితాళ వర్ణములోనూ రెండవ ఎత్తుగడ స్వరములు 1 ఆవర్త స్వర కల్పనకు మంచి ఉదాహరణలు, మార్గదర్శకములు. ఆ స్వరాలను పదే పదే మననం చేస్తూ పాఠం చేస్తే మంచిది.

పై కాలపు స్వరాలు 1 ఆవర్తం మేరకు వేరే వ్రాయవలసిన పని లేదు. అధ్యాపకులు మార్గం చూపిస్తూ పాడి విద్యార్థులచే పాడిస్తే చాలు.

ఈ విధంగా 2 ఆవర్తపు స్వరకల్పన రెండు కాలములలోనూ కూడా విద్యార్థిచేత పాడించాలి. ఇంతమాత్రము నేర్చుకుని సాధకం చేసిన విద్యార్థి రెండు ఆవర్తముల స్వరకల్పన నిరాటంకముగా చేయగలుగుతాడు. కాని చాలా ఆవర్తపు స్వరకల్పన నడపడానికి ధైర్యం చాలకపోవచ్చును. ఆ ధైర్యం కలగడానికి మార్గం లేకపోలేదు.

చాలాదూరం ప్రయాణం చేస్తున్నప్పుడు కిలోమీటరు దూరం కొలతగా తీసుకుని ప్రయాణం సాగిస్తాం. అదేవిధంగా చాలా ఆవర్తాలు స్వరకల్పన చేస్తున్నప్పుడు ఆవర్తం కొలత చూసుకుంటూ కల్పన చేస్తే ఏ క్షణంలో తాళంలో ఎక్కడున్నామో తెలుస్తుంది, జాగాకి రావడం సులభం. ఆదితాళంలో ఆవర్తానికి (పై కాలంలో) 32 అక్షరాలు కొలత కష్టం; 16 అక్షరాల చొప్పున మనసులో కొలత చూసుకుంటూ కల్పన సాగిస్తే సుళువుగా ఉంటుంది. అందుకై 16 అక్షరాల నమోనాలు ఈ క్రింద జతపరుస్తున్నాను.

## 16 అక్షరాల అభ్యాసం - తోడిరాగము

| | | | | | |
|---|---|---|---|---|---|
| సా ; ; రిసనిదా సనిదపమ | | | 6 | 5 | 5 |
| పా, దా, నీ, సానీదపమ | | 3 | 3 | 3 | 7 |
| పా, సనిదపా, నిదప పమగరి | | 3 | 6 | 3 | 4 |
| గమపమాప మపదనీద నిదపమ | | | 6 | 6 | 4 |
| మదపమాగ పమగరిస సరిగమప | | | 6 | 5 | 5 |
| నిదా దపా పమా పనిద పదపమ | 3 | 3 | 3 | 3 | 4 |
| గమపమా, మపదపా, నిదపమ | | | 6 | 6 | 4 |
| పదనిసా మపదనిసా సనిదపమ | | | 5 | 6 | 5 |
| రీరిసనిద నిసరిరిస నిరిసనిద | | | 6 | 5 | 5 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| సా, నీ, దా, పా, నిదపమ | 3 | 3 | 3 | 3 | 4 |
| దా, పా, ని ద సనిదపా మగరి | | 3 | 3 | 7 | 3 |
| రిగమగారి మగరిస గరిసనిదని | | | 6 | 4 | 6 |
| రీరిసాస నిసనిరి నిసనిదపమ । | | 3 | 3 | 4 | 6 |
| గమపదపా, మపదనిదా, నిద । | | | 7 | 7 | 2 |
| ససనిదనీ ; దా ; నిదపమ | | | 8 | 4 | 4 |
| నిసపదమప రిగమప దపమగరిస । | 2 | 2 | 2 | 4 | 6 |
| పా, దపమగరి గా, మగగరిస | | 3 | 5 | 3 | 5 |

## విరామాలు ఎక్కువగా ఉన్న 16 స్వరముల కల్పన.

## భైరవిలో

| | | | | | |
|---|---|---|---|---|---|
| మా, గా, రీ, గామా పామ | 3 | 3 | 3 | 4 | 3 |
| పా, సనిదపా, దాపా మగరి | | 3 | 6 | 4 | 3 |
| దపామగ రిగామప సరీగామ | | | 5 | 5 | 6 |
| సరీగా, రిగామా, పాదప | | | 6 | 6 | 4 |
| నీదపా దాపమా పమా గారి | | 5 | 5 | 3 | 3 |
| పా, దపమ గా, పమగ మాగరి | | | 6 | 6 | 4 |
| పాదపమా మాపమగా రిగామ | | | 6 | 6 | 4 |
| రీ ; ; రిగమపా మాగరిస | | | 6 | 5 | 5 |
| సా, రీ, గా, మా, పాదప | 3 | 3 | 3 | 3 | 4 |
| దనిసరీ, పదనిసా నిదపమ | | | 6 | 5 | 5 |
| సానిద నీదప దా, సనిదపమ | | 4 | 4 | 3 | 5 |
| సానిద నీదప దా దపామగరి | | 4 | 4 | 2 | 6 |

## చిన్న పరిధిలో-అనగా 4, 5 దగ్గర స్వరాలతో కల్పన

(షణ్ముఖప్రియ రాగం–16 అక్షరాలు)

| | | | | |
|---|---|---|---|---|
| దపమ పదప మపదదప నిదదపమ | 3 | 3 | 5 | 5 |
| మపద దపమ నిదప నీదాదపమ | 3 | 3 | 3 | 7 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| పమదదపా నిదపదనీ నిదపమ | | | 6 | 6 | 4 |
| దనిద పదప మపనినిదప నీదప | | 3 | 3 | 6 | 4 |
| మగమపదా మపదనిదా నినిదప | | | 6 | 6 | 4 |
| మపద దపమ పదనినిదప సనిదప | | 3 | 3 | 6 | 4 |
| నీనిదపద నీనిదప నీదపమ | | | 6 | 5 | 5 |
| పదప మప గమప నిదప నీనిదప | 3 | 2 | 3 | 3 | 5 |
| దదప మపదప నీదప సానిదప | | 3 | 4 | 4 | 5 |
| పాద పమప దాపమప దాదపమ | | 3 | 3 | 5 | 5 |
| పప దదపప నినిదద నినిదదపమ | | 2 | 4 | 4 | 6 |
| సరిరి నినిసస దదనిని పదదపమ | | 3 | 4 | 4 | 5 |
| పాడ నీద డాప మాదా దపమ | 3 | 3 | 3 | 4 | 3 |
| పా, దపా, నిదా, నిదాపమ | | 3 | 4 | 4 | 5 |

## ఎక్కువ స్వరాల పరిధిలో దూరపు సంచారాలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| పమగ దపమ నిదప సానీదపమ | | 3 | 3 | 3 | 7 |
| సనిదపామ గరిసా, నిసరిగమ | | | 6 | 5 | 5 |
| రిగమపా దనిస గరిస నీదపమ | | 5 | 3 | 3 | 5 |
| గరీ రిసా సనీ నిదా నిదపమ | 3 | 3 | 3 | 3 | 5 |
| పదనిస రిగరిస నీద దపమగమ | | 4 | 4 | 3 | 5 |
| పమగరిసా రిసనిదపా గరిసని | | | 6 | 6 | 4 |
| రిగమపద మపదనిస రిగాగరిస | | | 5 | 5 | 6 |
| గరిసనిదప మగరిసా నిసరిగమ | | | 6 | 5 | 5 |
| గమప మపద పదని దనిస నిసరీ | 3 | 3 | 3 | 3 | 4 |
| పమగరిగ నిదపమప సనిద గరిని | | 5 | 5 | 3 | 3 |
| పమగరిగ నిదపమప సనిదనిదప | | 5 | 5 | 3 | 3 |
| గరిస నీ స రిగమపద నిసరిగరి | | | 6 | 5 | 5 |
| గరిసనిసా నిదపమపా గరిసరి | | | 6 | 6 | 4 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| నిసనిగరి నిసనిరిస దనీదపమ | | | 5 | 5 | 6 |
| పమదాపమ నీదప సానిరిరిస | 2 | 4 | 4 | 3 | 3 |
| గరిస నిదని రిసనీద పమగరిస | | 3 | 3 | 5 | 5 |

ఈ విధంగా దాటు, జంటస్వరాలతోనూ, ఆవులతోనూ 16 అక్షరాల స్వరాలు వ్రాసి యిచ్చి పాడించినా సరే తాను పాడి విద్యార్థిచేత పాడించినాసరే, బాగా సాధకం చేయిస్తే స్వరకల్పనా రీతులు బాగా బోధపడతాయి. చాలా ఆవర్తాలు కల్పనచేసినప్పుడు ఆదితాళములో 16 లేక 32 అక్షరాలు ముగియగానే మనసులో గుర్తు ఉంచుకుంటూ సాగితే స్వరకల్పన అర్థవంతముగా ఉంటుంది.

సమజాగా స్వాధీనమయాక ½ జాగా, అంటే క్రియకి 4 అక్షరాల చొప్పున నడుస్తూన్న ఆది తాళములో 2 అక్షరాల జాగాకి, 1½ జాగా అంటే 6 అక్షరాల జాగాకి స్వరకల్పన అలవాటు చేయించాలి.

# ఆరవపాఠం

ఈ పాఠం విద్యార్థిలో "జాగా పరిజ్ఞానం" పెంపొందింపచేసేటందుకు పనికివస్తుంది.

మొట్టమొదట ఆదితాళంవేసుకుంటూ, 3 – స్వరాల ఖండలనే వరుసగా ఒకటి, రెండు ఆవర్తాల వరకూ పాడుతూ వెళ్ళి, చివరికి, అంటే జాగాకి వచ్చేటప్పుడు, 3–స్వరముల ఖండమును వదిలి ఎన్ని స్వరాలు మిగిలిపోతే ఆ విడి స్వరాలను పాడి ఆవర్తము ముగించాలి. అదేవిధంగా ఆదితాళమే వేస్తూ వరుసగా 4, 5, 6, 7, 8 స్వరఖండాలను కూడా ఒకటొకటిగా తీసుకుని పాడి, జాగాకి రావడానికి కావలసిన విడి స్వరాలను ఖర్చీచేసి ఆవర్తం ముగించాలి. ఈ విధంగా మిగిలిన రూపక, ఖండ, మిశ్రచాపు తాళములలో కూడా సాధకం చేయించాలి.

ఈ రకపు కృషివలన ఏ తాళములోనైనా, ఏ జాగాకైనా సరే జాగాకి రావడం సులభమవుతుంది, అలవాటుకూడా అవుతుంది.

**ఉదాహరణలు : శంకరాభరణరాగం–ఆదితాళం**

పదా మపా గమా రిగా సరీ ని̣సా రిగా మపా దపా మగరి గమ ||

(9 త్రిస్రాలు, ముగింపుకోసం ఒక ఖండం (5) )

పపమగ మామా పమగరి గా; గరిసని̣ రీ; మగారి సరిగమ ||

(8 చతురస్రాలు.)

దాపమగ మాగరిస రీసని̣స రిగమపా దనిసరీ సనిదపా గమ ||

(6 ఖండాలు, చివర 2 స్వరాలు)

దపామగమ పమాగరిస ని̣సారిగమ పదానిసా సనీదపమ గమ ||

(5 ద్వి – త్రిస్రాలు, చివరకి 2 స్వరాలు)

సానీదపమ దాపామగరి పమగాగరిస రీ; సని̣ధ̣ సరిగమ ||

(4 సప్తకాలు, చివర 4 స్వరాలు)

పా, దపమగమ పా, మగరిసని ససాపమగమరి గమప గమరిగమ ॥

(4 ఎనిమిదులు)

ఒక ఆవర్తవు స్వరాలే వ్రాశాను. ఈ విధంగానే ఒకే జాతి స్వరాలు **4** ఆవర్తముల వరకూ పాడి, చివరకు పొడి అక్షరాలతో జాగాకి వచ్చేలాగ సాధకం చేస్తే జాగా – **sense** – అనగా జాగా ఎన్ని అక్షరాల దూరమున్నదో క్షణంలో తెలుసుకుని జాగాకి వచ్చే జ్ఞానం-కలుగుతుంది.



# ఏడవపాఠం

స్వరకల్పనా జ్ఞానం కలగడానికి వర్ణించి సాధకం చెయ్యవలసిన పాఠాలు ఇంతటితో పూర్తి అయాయి. పూర్వవాగ్గేయకారులు రచించిన వర్ణములూ, కృతులలోనున్న చిట్ట స్వరములు విమర్శనా దృష్టితో పరిశీలిస్తే స్వరకల్పనా జ్ఞానం ఇనుమడిస్తుంది. వర్ణములలోవలె స్వరకల్పన చేయాలి అనే పట్టుదలతో సాధకం చెయ్యడమే కడసారి ప్రయత్నం.

## ఉదాహరణలు

1. కల్యాణి ఆదితాళ వర్ణములో చరణం చూడండి.

సీ ; ; సదసని దపమ గమా । పా ; ; మపదనిప దనిదరిస ॥

ఈ స్వరంలో స్వరములకూర్పు 6 4 3 3 । 6 5 5 ॥
ఈ మోస్తరుగా ఉన్నది. ఇటువంటి స్వరమే ఈ విధంగా కల్పన చెయ్యవచ్చు.

పా ; ; నీదప దపా మగమ । పా ; ; పమగరిస సనిదపమ ॥

2. కల్యాణి వర్ణంలోనే 3వ ఎత్తుగడ స్వరములో 2వ ఆవర్తము.

నిసని గరిగసరి నిసారి సరినిస

దనీసనిదపమ గమపదా నిగరి ॥

3 5 4 4 । 3 5 5 3 ఏర్పాటులో **ఉంది.**

ఇటువంటి స్వరమే కల్పన చెయ్యవచ్చును :

సరిస నిసదనిద పదాప మపగమ ।

రిగా మపదనిస గరిసనీ దపద ॥

3. సావేరి ఆదితాళ వర్ణంలో పల్లవిలో 2వ ఆవర్తం.

సరిపమగరిస దదమగరిస ధ్సరి I మపద రిపా
మపదనిదమ గరిసధ II

7 6 3 3 3 6 4 ఏర్పాటులో ఉంది.

ఇలాంటి ఏర్పాటుతోనే, ఇంకొక స్వరం కల్పన చేయవచ్చు.

దపమపమగరి సరిమపదప మపద I సరిస గరి సనిదదపమ
నిదపమ II

4. **కాంభోజి** ఆదితాళ వర్ణంలో పల్లవిలో 2 వ ఆవర్తం:

ధ స రి పమగ సరిగమపద మగపద I
రిసానిదప దపామగరి రిసాన్ధి II

3 3 6 4 I 6 6 4 ఏర్పాటులో ఉంది.

దీని మోస్తరు స్వరాన్నే కల్పన చేస్తే ఇలాగుంటుంది.

ని ద ని పదప మపదసనిద నినిదప I
సనీదపద నిదాపమప మగమప II

5. **కాంభోజి** ఆదితాళ వర్ణములో 2 వ ఎత్తుగడ స్వరం-

నిదపమా, పదపమా పమగమప I
మదపమా పనిద మపసనిద సరిగ II

6 5 5 I 5 3 5 3 ఏర్పాటులో ఉంది.

మగమపా, గమపదా నిదనిపద I
మపదసా పదస సీనిదప మపద II

అని కల్పన చేయవచ్చు.

6. **హంసధ్వని** ఆదితాళ వర్ణములో-అనుపల్లవి 2వ ఆవర్తములో

రిసని పనిసరిగ సరిగప గరిసని I
రిరీసనిప పగారిసన్ని పన్నిసరి II

